# వాల్మీకి

వాల్మీకి

బోయవాడై, కర్కశకాయుడై దారిలో పోవువారిని వెంబడించి వారివద్ద ఉన్నవి దోచుకొనెడి ఈ బోయవాడు ఒకానొక రోజున సప్తర్షులు తాము ఉన్న వనప్రాంతములో పోవుచుండగ వారిపైకి ఉరికి వారిని హింసింప పూనగ అప్పుడు సప్తర్షుషులు ఒక పరీక్ష పెట్టిరి.

“ఓ శబర! నీవు దారిలో పోవు వారిని క్రూరత్వముగ ఇక్కడ దోచుకున్న వస్తువులను నీ భార్యాబిడ్డలకు అందజేయుటలో గొప్ప పాపము సంభవించుచున్నది. కావున నీవు నీ ఇంటికి వెళ్ళి మేమడిగిన ప్రశ్నకు సమాధానమును తెలుసుకొని రమ్ము. నీవు వచ్చునంతవరకు ఇచ్చటనే ఉందు"మని సప్తర్షులు పలికిరి.

అంత ఆవేశపడిన ఆ బోయవాడు మీ సందేహమేమిటో చెప్పుడు దానిని నేను నివృత్తి చేసెదను అని పలికెను. అప్పుడు సప్తర్షులు “ఓ శబర! దారిలో పావు వారిని హింసించుట వలన వచ్చెడి పాపఫలితములారు. ఇంటిలో వారుకూడ పంచు కొందురా” అని వారి ఇంటికివెళ్ళి తెలుసుకొని తమ్మని పంపించెను.

అటుపై బోయవాడు పరుగుపరుగున ఇంటికి వెళ్ళి భార్యాబిడ్డల వద్ద ఈ విషయమును ప్రస్తావించెను. అప్పుడు అందరు మూకుమ్మడిగ “ఇంటియడమానివైన నీవు కుటుంబము పోషించ వలసిన బాధ్యత నీది. నీవు దారి దోపిడి చేసి తెచ్చెదవో కష్టించి సంపాదించెదవో మాకు తెలియదు. నీవు చేసిన పాపకార్యములకు ఎలాంటి సంబంధము లేదని” బదులు చెప్పిరి. ఆ మాటలు విన్న బోయవాడు వెంటనే వరనస్సులో ఒక మార్పును పొంది సప్తర్షుల వద్దకు వచ్చి జరిగిన ను తెలిపెను.

అంత వారు “చూచితివా! ఎవరికోసమైతే హింసా ప్రవృత్తితో ఈ పాపకార్యమును చేయుచున్నావో వారే ఇందుకు భిన్నముగ ప్రవర్తించినచో నీవు కష్టించి ఫలితమేమి” అని నీవు చేరుకొవలసిన స్థితి ఇదికాదు. భగవంతునివైపు నీ మనస్సును మరల్చుకొని మేము చేసెడి మంత్రోపదేశమును విని పునరావృత్తముగ మరల మరల ఆ మంత్రమునే జపించుచుండుము. మేము తీర్థ యాత్రలకు వెళ్ళి తిరిగి వచ్చునంతవరకు ఈ మంత్రమునే జపించుము అని పలికి సప్తర్షులు “మరామరా” అని మంత్రము చెప్పి వెడలిపోయెను.

అంత ఆ బోయవాడు సప్తర్షులు చెప్పిన ఆ మంత్రము పైనే మనస్సును లగ్నము చేసి ఆ నామ జపముచేసి తపోదీక్షగ సలుపుట చేత అతడు ఒడలు మరచినవాడై జపించుచుండగ తన చుట్టూ పుట్టలు లేచెను. కావున వాల్మీకము అనగ 'పుట్ట' వాల్మీకుడునగ పుట్టలోనించి వచ్చినవాడని అర్థము.

ఇలా రామనామ జప నిష్ఠాగరిష్ఠుడై ఆదికావ్యమైన రామాయణము అను ఇతిహాసమునకు కారణభూతు డయ్యెను.

రామ అనగ 'నమో నారాయణాయ' అనే అష్టాక్షరములలో ఒకటైన ‘ర’, అలాగే ‘ఓం నమశివాయ' అనే పంచాక్షరిలోని 'మ' ను కలుపగ 'రామ' అయినది. అనగ రామ శబ్దము 'రమయతీతి రామః' అందము కూర్చునని అర్థము. అలాగే శివ కేశవ అభేదముగాను చెప్పవచ్చును.